# Menaka Kousika
# SAMVADAM.

మేనకా కౌశిక సంవాదము.

BY

K. VEERAMALLIAH PANTULU,

OF BEZWADA.

Inc 1658
SINP

SECOND EDITION (Revised). 1000 COPIES

PRINTED BY D. K. PANT, AT VANI PRESS.

BEZWADA

1910

బనిపినవాఁడు గల్గిన వి
వాదము దీన నెఱుంగఁగానగున్.

మేనక-మ. రమణీవ్యూహముతోడ సంతతము
నారామస్థసౌధంబులన్
గమనీయోక్తులఁ గాలయాపనమునుం
గాంక్షించురాజన్యవం
శము నుంబోవిడి కందమూలఫల ని
స్సారాన్నముండించు సం
యమివై యొంటిగనుంటి గాధిసుత సౌ
ఖ్యంబింతగానేర్తువే.

కౌశికుఁడు-మ. పటుసౌఖ్యప్రదమంచు రాజ్యభర గ
ర్వప్రాభవంబంది ముం
గిట నేమున్నదొ కానలేక ప్రజలన్
గ్రేగంటవీక్షించి దు
ర్ఘటకృత్యంబులు సేసి కాలువురిఁ జే
రంబోవుటల్ కన్న ధూ
ర్జటి సేవించు మునీంద్రవర్తనమునన్
సౌఖ్యోదయంబుండదే.

మేన-చ. అధికరమానివృత్తి తొలి
యందునమున్న వరే, నిరంబినీ
యధరము గొంతకాలమటు
లాని హాతాతుగ న ర్తపంబు నీ

విధవమున ఘోరదీక్ష నట్ట
    వీస్థలిసల్పిన నేమిలాభమీ
విధివిడనాడినప్పు డలి
    వేణులు జ్ఞప్తికిరాకయుందురే.

కాశి- చ. ధరమగుదీక్షచే నెపుడ
    వార్యముగాఁగఁ దపస్సమాధిలో
గురుపదభక్తినిన్నిలిపి
    కూర్చొనియుండిన తుచ్ఛమైన సుం
దరులప్రశంసయొక్కరణి
    జ్ఞప్తివచ్చును కోనిశక్తసీ
వెఱుఁగమినిట్టులాడితి, వు
    మేసునిచింత శివన్నిలొచ్చగుఁ.

మేన. చ. చెలులప్రశంస తుచ్ఛమని
    చెప్పితి వయ్యది లేకయున్నచో
నిలుచున లోకజాలములు
    నీరజనేత్రుఁడు బ్రహ్మ శంకరుం
డలికులవేణులఁ హృదయ
    మందున మోమున దేహమందునఁ
నెలవులొనంగి యుంచుటని
    నింద్యమనంగలకే నగోత్తముల్.

కాశి- చ. తరుణి వృథాప్రసంగమునఁ
    దద్దయుఁ గాలమున్పుచ్చనేల నీ

వరుగుము స్వంతకార్యముల
    నన్నిటివీడి యిటులవచ్చితో
యొఱుఁగఁగఁజెప్పు మేదయిన
    నీవలెవన్న నొసంగిపంపెదన్
సరసిజపత్రనేత్ర యిఁకఁ
    జయ్యనఁబోవలెఁ దానమాడఁగన్.

మేన- మ. మునివంశోత్తమ! మీయనుగ్రహమునన్
    బొందంగరానట్టి వెం
దును లే వియ్యది నిశ్చయంబనుచు నే
    నున్నేర్తు మీదివ్యద
ర్శనముం జేసెడి భాగ్యమబ్బుట మహా
    సామ్రాజ్యముల్ గూడుటో
యనఘాత్మా! మముబోంట్లనాదరము
    సేయుంజూచు టైశ్వర్యమే.

కాశి- తే.గీ. స్తోత్రపాఠంబులేటికి సుదతినీవు
వచ్చియున్నట్టికార్యంబువ్యక్తపఱుపు
మవలనియమితకాలఁబు మివులకుండ
జరుగవలెసుమ్ము నిలువ బుణ్యమ్ము వమ్ము.

మేన- మ. యతిచూడామణి! మాకొలంపుచెలుల
    న్యప్రార్థనల్ సేతురే
కుతుకంబొప్పఁగఁగోరు పూరుషులునా
    కుంలభర్తవహిఁకొందునా

వ్రతదీక్షా ఫల మట్టునట్టు లోనగూ
ర్చక రెండు నాయావనం
బతి తేజంబుగ వృద్ధిఁ జెందుటయు మూ
దర్పించి మన్నింపవే

కాశి- తే.గీ ఇచ్చినాఁడనుగోనుము నీ యిష్టమైన
మూఁడువరములుఫలియించు ముదితనీకు
ప్రీతిఁజెందుముపొమ్ము నీ ప్రియులకడకు
నాకుఁదడవయ్యె పోదు స్నానముసేయ.

మన- ఉ పోవుటయెట్లు నావరముఁ
బూర్తియొనర్పక నేను నీపయుర్క
భావమునించియుంటి ఫల
వంతముసేయుము నాదుకోర్కె
మీవరశక్తి చేత నిది
మీకునుదప్పదు మానివర్య నేఁ
దావక పాదపద్మములఁ
దద్దయుఁగొల్చెద నాదరింపవే

కాశి- తే. గీ. అకట సంసారమునుమాని యడవులందుఁ
దపమువల్పెడుమాయట్టి తాపసులను
గర్హ్యాకృత్యంబుసేయఁగాఁ గడఁగుమనుచుఁ
గోరుటొప్పునె నీయట్టి ధీరమతులు.

మేన- చ. పదుగురుమెచ్చునట్లుఁబరి
పాలనఁజేసి శశాంకబింబముం
బదిమెదుమోముఁగల్గి నృప
శేఖరవంశమునందుఁబుట్టి న
మ్మదినలరించు యౌవనము
మానుఁగఁగల్గిన యిమ్ముఁగూడి స
మ్ముదమునుజెందకటు మము
లొంట్లకుఁ గొండొక సౌఖ్యముండునే.

కాళి- ఉ. ఓసి వెడంగ ! నీయెడ న
యౌచితవృత్తివరంబులిచ్చినన్
వీసముగాని పెద్దయని
పిన్నయటంచును నెంచకుండఁ జే
రాపవహించు నక్కగతి
నైతివి నేనుశీలనైతి భ
స్మాసురుమెచ్చి వాంఛితము
లర్పణసేసిన యీశుకైవడిన్.

మేన- తే.గీ. చావువిషయంబువారిది సౌఖ్యవిషయ
మిదియ దీనికిదాని కేదసామ్య
మకట్టు చాలు మీబోటు లిట్లనుటలగున
తగవుసేతురె ముక్తికాంతనువరింప.

కాళి- తే. గీ. ముక్తికిని వారకాంతల పొందునకును
సామ్యముండున వేదాంతసారముల్లఁ

దెలిసినట్టులసెప్పెదు త్రిప్పకొనుచు
మానుమీూయాటమాటలు చానయికను.

మీన- తే. గీ. జన్మరాహిత్యమైనచోఁ దన్మయంబు
గతినిస్వర్గహార్యంబుల రతులఁదేలఁ
దగిన సురవారకాంత భూతలమునందు
గలుగుకంటనునాము క్తి కాంతయొండె

కౌశి- మ. పరమార్థంగని చిక్కఁబట్టి హరసే
వార క్తికాలంబునన్
జరుపన్ దన్మయమానుగాని కనుతు
చ్ఛంబైనవంచేంద్రియా
ర్ధంతన్ బాయఁగ స్వర్గభామినుల పొం
దున్ గాంచుమాత్రంబునన్
స్థిరసౌఖ్యంబని యెంచనానాకా సదా
జీవైక్యమే లేనిచోన్.

మీన- క. వేశ్యావిటులాలైక్యము
వశ్యముగాఁ జేసికొనిన వట్లనన్నే హా
వశ్యకరకలుగునాకెటు
కాశ్యపికూటంబుగలుగు గాశికచెప్పుమా.

కాశి- తే గీ. దేవవేశ్యవుగానమా త్రిదివమందు

కామినీజనసాంగత్య గరిమ గున్న
నుభయలోకభ్రష్టుఁడగుసుమ్ము యువిదపొమ్ము.

మేన- మ॥ మునిలోకంబున మీావశిష్ఠుఁడును నా
ము న్నైన వారందఱున్
వనితాసంగతిగల్గియుండరొకో, యు
ర్వ్యారన్న ప్రాచీను లీ
వన సిన్నెన్కటివాఁడవౌను నిజమే
యీామాటలంబోలె నీ
వును శక్తుండవయేని జంకుకువె నేఁ
బోధన్ క్షమింపంగదే.

కౌశి- తే.గీ. నీ! వసిష్ఠుఁడుమాత్రంబు దేవసముఁడె
నేను నతనికిఁ బోల్పఁగా నింతినిన్ను
గలిసి నీకోర్కెదీర్చెద గరుము తపము
విఘ్న మొందిన మఱలఁ గావింతుఁగొంత

మేన- ఉ. పాపము మీాతపంబునకు
భంగము సేయఁగ నేల? మీాకు సం
తాపమునొందనేల? నను
దద్దయు వంతముచేతఁగూడి మీా
కోపముతీరువన్క- కుటి
కొంత తపంబొనరింపనేల? నా
శాపపీడచే మరల
స్వాంతముమీాపయి నుంచనేలనో.

కా- తే గీ. అతివ! నీకు నదో్యగర్వ్యముమరం జేసు
నఖిలసౌభాగ్యములుకూడ నానతిత్తు
మదినివేడ్కొంచు తలంపు నేమరుముసుమ్ము
రమ్ము సౌదామినీవల్లి రతులవెల్లి.

మేన- క. దేవా! నాపైనదయా
భావమునుంజూపినన్ను బంపుమునాకై
దేవవిభుం డటగనలం
బోవునుయేమో భయంబు పొడముచునుండెన్

కాశి- చ. వెలంది భయంబునొందకు త్రి
విష్టపమంతయు నానవెట్టెదన్
జలమున దేవనాధుండు వి
శాంపతిమానిని నన్నుంగూడు నిన్
జులకనసేయంగాంగలండె
సుందరి నీ కభయంబునిత్తు నెం
దులకింక జాగుసేయం బరి
తోషముతోడం గవుంగలింపవే.

మేన- తే. గీ. జ్ఞానసంయుక్తులైనట్టి మానవులకు
గర్హ్యమైనట్టి పశుసమాగమముగాని
బట్టబయటను బలవంతపెట్టందగునె
ఇంద్రియోన్మాదమడంచు మిాకిద్దిఘనమె.

కౌశి- మ. జలజాక్షీ ! మున్ను నిందు త్వన్మ్రదువచ
స్సంలబ్ధదోశ్శక్తిచే
లలినీమావులఁ బూవులఁ బరవి శ్రీ
లం బెల్ల సాంతంబుగా
జలధిఁ ద్రోయ మునింగిరిఁ గుచగిరుల్
సంధించి పై కెత్తి త్వ
ద్బలదజ్జాక్షీ ముఖేందుయోజనము చేఁ
సౌఖ్యాబ్ధి దేలింపవే.

మేన- తే. గీ. మీయనుజ్ఞకు వేచియుండు సెప్పఁగలని
యార్య ! సేఁగోఁనవుడు ప్రత్యక్షమగుచు
నామకోర్కెలుదీర్పఁగా మోదమంది
వరమొసఁగుము పొదరింటిదరికిరమ్ము.

కౌశి- తే. గీ. అదియకాకున్న నాప్రాణమైననిత్తు
సంశయింపఁగ సేలరో సకియవినుము
సేద్యగానికి నాగంటిసిడముబట్ట
బరువుతోఁచూః రారమ్ము పదలియున్న.

మేన- తే. గీ. దేవ! యీపూవుటేరంబు దివ్యభవన
మునకుపరిణాలు సుమనసపూతమగుట
ఘనతరామోదమున భవత్కరయుగంబు
పల్లవమ్ముగఁజేయు మీకేఁతతలముకుడు.

కాశి.-మ. వనితా! నాదుపురాకృతంబున, లన
ద్వ్యాకుప్తాలితంబై, మనో
జనితోత్సాహనివాసమై, మనసిజా
త్రుప్రాపకంబై, సుధా
ఘనిమై, యొప్పుత్వదోష్ఠపానమున సౌ
ఖ్యంబందితిన్ నిప్డసీ
తనుజాతన్ గాని దేవలోకమున ని
త్యశ్రేయముల్ గాంచుమీ.

మేన. మ. అనఘా! మీకరుణాప్రభావ జనితం
బైనట్టి యీకన్యకన్
ఘనసమ్మోదముతోడ బెంచుకొను మా
గర్వంబుల్ విచారించుమీ
మునివంశాంబుధిచంద్ర! స్వర్గమునకుం
బోవంగ నాలస్య మ
య్యెను నాకాపతి నిమ్ముపోమ్మనుచు దే
వేంద్రాజ్ఞ గావింపఁగన్.

కాశి.- తే.గీ. అడవులంబడి యొంటినహర్నిశము
దపముసల్పెదు నాబోటి తాపసులకు
పిల్లలను బోషణముసేయ వీలుపడునె
నీవపాతకమ్ముగ నేసి నిను పుసెట్ల?

మేన- తే.గీ. ఎవరుపిలిచిన న్నచ్చోటికేగుచుండు
అంతరాత్రిదాక పిల్లలయంకి లేకేగి
సాకుటన్ననుసేరితి సాధ్యమగును
నీవసాకుము శ్రమచేసి వినువునెట్లొ.

కాకి- ఉ. స్తన్యముఁ నేడఁ దెత్తుఁబరి
ధానము లేగతిఁ దెత్తునీ పెనీ
వన్యమృగాళి మధ్యమునఁ
బాలన మేగతిఁ జేయనేతి సా
మాన్యమె పిల్లకాయలకు
మజ్జనముల్ పచరించుటన్న నీ
కిన్యను నీవసాకవలెఁ
గాకెటు నావశమౌను గోమలీ.

మేన- తే.గీ. పుట్టుపిల్లలనందఱికిఁ బోషణంబు
సేయుభారంబువాదిరాదఁ జేర్చుకొన్న
నిల్లుపట్టున నేనేడయాదు టేడ
యెందఱిటులనద్యోగరభ మిచ్చువారు.

కాకి- తే గీ. పిల్లలను బెంచు భారంబు తల్లులందె
నుండవలసినదే కాని మొదలకెట్టు
సాధ్యమగునిట్టి కార్యంబు జలజవదన
నేనుబూనఁగఁజాలనే మేనిదైన.

మేన- చ. వనివకిఁబట్టి కార్యమును,
బైనిడుకోసమ మానిచంద్ర? జ
వ్యతులను మోసగించితిరి
ప్రప్రథమంబునఁ జెప్పకుండఁ బా
పనుగొని పొమ్మటంచనుట
పాడియె? యోఋషివర్య! నేనిదే
చనియెదఁదీసికొమ్మిదిగొ
చయ్యనఁ జేరికి బాలికామణిన్.

కౌశి- చ. వరములనిచ్చువేళ విధి
వద్దనిచెప్పక సంతసించి యి
త్తఱినిటు లడ్డగిడ్డములఁ
దద్దయుఁ జెప్పుట నీకు జెల్లునే
వెఱవకు కన్యకామణిని
కొంచినపుణ్యము నీకుదక్కు నె
మ్మది మఱనేయకుండ విన
యమ్ముగఁ బొమ్ము రయమ్మునన్ జెలీ.

మేన- తే.గీ. అకటనిష్ఠుర పెట్టెద వయ్యనన్నుఁ
గాలనంకిలియగు బాలికనుభరింప
జాలకమియుంపు సుఖలంబు వంయమీంద్ర
మొజెఁగియుండియు నిటుసెప్పనరసమగునె.

కౌశి- క. ఏనేమి సేయువాఁడను
దానా! యీవంటిబిడ్డ సాకుటయగున్నా

మానుల వర్తనమెఱుఁగవె
ఏనాఁడో కన్నతెరతు రేనిటు పెంతుర్.

మేన.-చ. ఋషివయినీవు వేశ్యనఋ
హేనునుగూడుటచేత నీగతిన్
విషమపరీక్ష వచ్చెవిధి
వెంగిలికాకిటువంటి పుత్రికన్
గృషి యొనరింపలేని గుణ
హీనులకిచ్చునె? కాపిలెండికన్
శపథిమలేల దీనిఁగాని
చేఁ విన స్వర్గసుఖంబులందెదిర్.

కాశి-తే.గీ. అన్నయొంతటిమాట నీవంటివబల
చాలుశిసుహత్యయొనరించు జనులకెవ్వుడు
ఘోరనరకంబుప్రాప్తించుఁ గొంచొకవ్వు
జేనిముక్తియే కలుగదుమానిజమ్ము.

మేన.-మ. నరకంబో త్రిదివంబొ యెవ్వరెఱుఁగుర్
వర్తించ రాచారముర్
గరిమారాధనసేసి పిడుటయకా
కజాంబు లేకున్నని
ర్వ్యగకుంబట్టని బిడ్డ నేమగును నీ
పున్నేనునుంగూడ వ
ర్త్వరమేచేరము చేరిమీాదుగనెపా
పంబింతిగాఁ బందుటన్.

కౌశి.- తే.గీ. కడుపునం ముద్భవించిన గాదిలిసుతఁ
జంపఁగాఁ జేతు లెట్లాడు సారసాక్షి
యిట్టికృత్యంబు మన కేల పట్టవలసెఁ
గాముమననిందు చేత నే గహోంకారంబు.

మేన.- క. వెనుకయు ముందుఁ జూడక
చనుదెంచిన దానికిట్లు సంభవ మయ్యెఁ
మనమునఁ జింతించినమా
త్రనఁదీరునె నిశ్చయించు తాపన ముఖ్యా.

కౌశి.- తే.గీ. సుదతి యేమైననీవ పెంచుముకుమారిఁ
జంపుమని సెప్పఁగా నోరు సాగకుండె
నేను నష్టపుక ముగొందు నసువు నేను
నుల్లుదయ నేసి సేయుమా యంబుజాక్షి.

మేన.- తే.గీ. దీనిఁగొని దేవపురమందుఁ దిరుగుటరయ
నీదుఱంకును జాటించు నెవము రాదె
ముందు వెన్కలఁ జూడక మొదటఁ జెప్పి
పిదపఁ జింతింపఫల మేమి మృదులభావ.

కౌశి.- చ. తనయను జంపనామనము
తద్దయు నొప్పదు కాన నల్వురఁ
జనుపథమందు పీడుదము
స్వామి దయామయుఁ డామె గాచునీ

యనుఁగుఁగుమారిఁ భూమినిఁ జి
రాయురుపేతముగాఁ జనించి వృ
ద్ధినిఁగనుఁగాత క్షాత్రకుల
ధీరుఁడు పెండిలి యాడుఁగావుతన్.

మేన- క. కడుపునఁ బుట్టిన బిడ్డను
విడనాడుట కష్టమందు విపినంబులలోఁ
బడవైచుట రాక్షసకృతి
చెడుదయ్యము బిడ్డకట్టి చేఁగొనఁగూర్పెన్.

కౌశి- తే.గీ. విధినిదూరఁగ నేల యీబిడ్డకట్టి
లోపముండదు బ్రాహ్మణశాపమునకు
ప్రేమఁ బెంచెదఁదరువాత పన్ని కార్య
వైభవంబులఁదీర్చెద వనితపొమ్ము.

గద్య.

ఇతి శ్రీమదాత్రేయసగోత్ర కాశీనాథసివాంశోద్భవ లింగ
యారాధ్య కాంతమాంబికాతనూజ వీరమల్లయారాధ్య
మాచమాంబికాదత్తపుత్ర బాపయవ్యావహారిక
నామధేయ వీరమల్లయాభిధేయవిరచిత మే
నకా కౌశిక సంవాదంబున సర్వం
బును సంపూర్ణము.

---

# ప్రకటన.

## ఆంధ్రదేశ భాగవతము.

౧. పండిత దాసు శ్రీరామామాత్య విరచితము.

ఇది మృదుమధుర శైలిలో వ్రాయబడి ౧౨౦౦ పుటలును ౧౦,౦౦౦ పద్యములును కలిగి గిల్టు అక్షరములతో సిల్కు క్యాలికో బైండు చేసినది.

వెల ప్రతి ౧కి రు 4-0-0 పోస్టుఖర్చులు కొనువారే భరించవలెను

ఈ గ్రంథము బెజవాడ వాణీ ప్రెస్‌లో దొరుకును.

